శీఘ్ర వివాహము కొరకు
వివాహం కాని యువతలు తప్పక పారాయణ
చేయవలసిన అద్భుత పారాయణ గ్రంథము

# రుక్మిణీ కల్యాణం

( శ్రీకృష్ణ నిత్యపూజతో)

**RUKMINI KALYANAM FOR UN MARRIED GIRLS**


రచన, సంకలనకర్త :

డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్

గుంటూరు.





ప్రకాశకులు : ☎ 246 2565

## మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదురుగా,

కోటగుమ్మం, రాజమహేంద్రవరం-1


 2016 వెల : 25-00

# రుక్మిణీ కల్యాణం
## (శ్రీకృష్ణ పూజతో)



రచన,సంకలనకర్త
**డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్** B.Sc., L.L.B.,
(లేఖిఖా చైతన్య)
కొరిటెపాడు, గాంధిబొమ్మ బజారు, **గుంటూరు - 7.**
ఫోన్ : (0868) 2353321, సెల్ : 9440262421





ప్రకాశకులు :
**మోహన్ పబ్లికేషన్స్**
కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533 101.

# రుక్మిణీ కళ్యాణం

## పారాయణ నియమములు

1. ముందుగా శ్రీకృష్ణుని నిత్యపూజచేసి రుక్మిణీ కళ్యాణం పారాయణం ప్రారంభించాలి.
2. శ్రీకృష్ణ నిత్యపూజ చేయలేని వారు కనీసం కృష్ణ అష్టోత్తరము మరియు కృష్ణాష్టకము ఖచ్చితముగా చదవాలి.
3. మీ జన్మనక్షత్రము రోజుగాని, లేదా నామనక్షత్రము రోజుగాని పారాయణ ప్రారంభించండి.
4. వీలయినంతవరకు శుక్రవారం,గురువారాలలో పారాయణ ప్రారంభించండి.
5. ఏకాదశి, పౌర్ణమి, దశమి, తిథులలో పారాయణ చేయండి.
6. పూర్వకాలములో శ్రీవైష్ణవులు రుక్మిణీ కళ్యాణం, శ్రీశైవులు, “గిరిజాకళ్యాణం” వివాహము కొరకు కన్నెపిల్లల చేత పారాయణ చేయించేవారు.
7. ముందుగా పారాయణ చేయవలసిన రోజున ఉదయం 5॥గం లేచి, తలారాస్నానం చేసి 6గం॥ కల్లా దీపారాధన చేసి శ్రీకృష్ణపూజ చేసి రుక్మిణీ కళ్యాణం పారాయణము ప్రారంభించాలి.
8. వీలయినంత వరకు ఉ॥ 9గం.“లోపుగా పారాయణ చేయించాలి.
9. తీపి పదార్థములు నైవేద్యంగా సమర్పించాలి. ఉపవాసము ఉండాలి. రాత్రికి భోజనం చేయరాదు.
10. నేలపై పరుండాలి. వీలయినచో సాయంత్రం మీ దగ్గరలోని గోపాలస్వామి ఆలయము దర్శించి తలసిమాల సమర్పించండి.
11. మీ పూజమందిరంలోనే తూర్పుముఖముగాని, ఉత్తరముఖముగా కూర్చుని పారాయణ చేయండి.
12. పారాయణ చేసే సమయములో మీ పూజామందిరములో కృష్ణుని ఫోటోగాని, విగ్రహముగాని ఖచ్చితంగా ఉండాలి.

**మీ కోరికలు- పారాయణ విధానములు :**

1. పెళ్ళీడుకొచ్చిన కన్నెపిల్లలు- 11 సార్లు పారాయణ- ప్రతి శుక్రవారం
2. పెళ్ళికాలేదని దిగులుపడుచున్న వయసుమీరుచున్న కన్నెలు- 40 సార్లు పారాయణ ప్రతిశుక్రవారం గురువారం.
3. గొడవలవల్ల భర్తకు దూరమైన భార్యలు- 32సార్లు పారాయణ ప్రతి గురువారం,శుక్రవారం
4. మొదట పెళ్ళి విఫలమై రెండో పెళ్ళికొరకు ఎదురు చూస్తున్న స్త్రీలు- 48 సార్లు పారాయణ ప్రతి మంగళవారం, ప్రతి శుక్రవారం.
5. ప్రేమించిన వాడిని పెళ్ళిచేసుకోవాలని ఆశపడిన కన్నెలు- 54 సార్లు పారాయణ ప్రతి మంగళవారం, ప్రతి శుక్రవారం, ప్రతి గురువారం.

మీకు వివాహము నిశ్చయము కాగానే ఎనిమిదిమంది కన్యలను పిలిచి (శ్రీకృష్ణుని అష్టభార్యలుగా భావించి) చందన తాంబూలములతో **రుక్మిణీ కళ్యాణం** అను పుస్తకమును దానముగా ఇవ్వండి శ్రీకృష్ణుని అనుగ్రహం ఖచ్చితముగా లభిస్తుంది.

## శ్రీకృష్ణ నిత్యపూజ

### గణపతి ధ్యానం

(శ్రీగణపతికి దీపారాధన చేసి దానిని గంధపుష్పాక్షతలతో నలంకరించ వలయును)

**శ్లో॥ శుక్లాంభరధరం విష్ణుం- శశివర్ణం చతుర్భుజమ్**
**ప్రసన్న వదనం ధ్యాయేత్- సర్వ విఘ్నోప శాంతయే॥**

(కుడిచేతియందు నీళ్ళు తీసుకుని ఈ క్రింది శ్లోకముతో మంత్రించి)

**శ్లో॥ అపసర్పంతు యే భూతాః । భూతాయే భూమిసంస్థితా।**
**యే భూతాః విఘ్నకర్తారస్తే నశ్యంతు శివాజ్ఞయా॥**

(అని చెప్పి కూర్చునే ప్రదేశాన్ని, పూజచేయు స్థలమును ప్రోక్షించవలెను. తరువాత దానిపై పీటనుగాని, మరియేదైనను పరచి కూర్చుండవలయును)

## ఆచమనం

| | | |
|---|---|---|
| ఓం కేశవాయనమః | – | (తీర్ధము పుచ్చుకొనవలయును) |
| ఓం నారాయణాయ నమః | – | (తీర్ధము పుచ్చుకొనవలయును) |
| ఓం మాధవాయ నమః | – | (తీర్ధము పుచ్చుకొనవలయును) |
| ఓం గోవిందాయ నమః | – | (ఎడమ అరచేతి ప్రక్షాళనము) |
| ఓం విష్ణవే నమః | – | (కుడి అరచేతి ప్రక్షాళన) |
| ఓం మధుసూదనాయ నమః | – | (బొటనవేలితో ఎడమనుండి కుడికి పై పెదవితడుపుట) |
| ఓం త్రివిక్రమాయ నమః | – | (బొటనవేలితో ఎడమ నుండి కుడికి క్రింది పెదవితడపుట) |
| ఓం వామనాయ నమః | – | (శిరమున జలము జల్లుకొనవలయును) |
| ఓం శ్రీధరాయ నమః | – | (శిరమున జలము జల్లుకొనవలయును) |
| ఓం హృషీకేశాయ నమః | – | (ఎడమ అరచేతిపై జలము ప్రోక్షించ వలయును) |
| ఓం పద్మనాభాయ నమః | – | (రెండు పాదములపై జలము ప్రోక్షించ వలయును) |
| ఓం దామోదరాయ నమః | – | (శిరముపై జలము జల్లుకొన వలయును) |
| ఓం సంకర్షణాయ నమః | – | (పదివ్రేళ్ళమడచి మొదళ్ళతో గడ్డం తాకవలెను) |
| ఓం వాసుదేవాయ నమః | – | (ఎడమ ముక్కును) |
| ఓం ప్రద్యుమ్నాయ నమః | – | (కుడి ముక్కును) |
| ఓం అనిరుద్ధాయ నమః | – | (ఎడమ కన్నును) |
| ఓం పురుషోత్తమాయ నమః | – | (కుడి కన్ను) |
| ఓం అధోక్షజాయ నమః | – | (ఎడమ చెవిని) |
| ఓం నారసింహాయ నమః | – | (కుడిచెవిని బొటన ఉంగరపు వ్రేళ్ళతోతాకవలెను) |
| ఓం అచ్యుతాయ నమః | – | (నాభిని బొటన, చిటికిన వ్రేళ్ళతో తాకవలెను) |
| ఓం జనార్ధనాయ నమః | – | (అరచేతిని హృదయానికి ఆనించవలెను) |
| ఓం ఉపేంద్రాయ నమః | – | (కరాగ్రముతో శిరమున తాకవలెను) |
| ఓం హరయే నమః | – | (ఎడమ భుజమును తాకవలెను) |
| ఓం కృష్ణాయ నమః | – | (కుడి భుజమును తాకవలెను) |

## భూతోచ్ఛాటనము

**శ్లో॥ ఉత్తిష్ఠంతు భూత పిశాచాః– ఏతే భూమిభారకాః।**
**ఏతేషాం అవిరోధేన – బ్రహ్మకర్మ సమారభే॥**

(అని అక్షతలు వెనుకకు చల్లుకొనవలెను. తరువాత కుడిచేతితో ముక్కును పట్టుకొని ప్రాణాయామము చేయవలయును. ఈ క్రింది మంత్రమును ముమ్మారు పఠించిన ప్రాణాయామము చేసినట్లగును)

## ప్రాణాయామము

**ఓం భూః – ఓం ఓగ్ంసువః మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం– ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి– ధియో యోనః ప్రచోదయాత్– ఓమాపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మభూర్భు వస్సువరోం॥**

(ఇట్లు ప్రాణాయామము చేసిన తరువాత సంకల్పము చెప్పుకొనవలెను)

## సంకల్పము

**మమోపాత్త దురితక్షయ ద్వారా– శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం– శుభేశోభన ముహూర్తే – శ్రీమహా విష్ణురాజ్ఞయా– ప్రవర్తమానస్య– అద్య బ్రహ్మణం– ద్వితీయపరార్థే – శ్వేతవరాహ కల్పే– వైవస్వత– మన్వంతరే కలియుగే– ప్రథమ పాదే– జంబూద్వీపే– భరతవర్షే– భరతఖండే– మేరోర్ధక్షిణ దిగ్భాగే– ఆంధ్రప్రదేశే– శోభనగృహే– సమస్తదేవతా బ్రాహ్మణచరణ సన్నిధౌ– అస్మిన్ వర్తమాన వ్యవహారిక చాంద్రమానేన (ప్రస్తుతం జరుగుచున్న సంవత్సరం, ఋతువు, నెల, పక్షము, తిథి,వారము క్రమముగా చేర్చి చెప్పవలయును.) ఋతువు– నెలపక్షము, తిథి, వారము క్రమముగా చేర్చి చెప్పవలయును).. సంవత్సరే... ఆయనే...ఋతౌ... మాసే.. పక్షే... వాసరే... శుభనక్షత్రే– శుభయోగ– శుభకరణ– ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్... గోత్రః... నామధేయః। శ్రీమతః.... గోత్రస్య.... నామధేయస్య। ధర్మపత్నీ సమేతస్య। అస్మాకం సహకుటుంబానాం। క్షేమ స్థైర్య ధైర్య విజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం– ధర్మార్థకామమోక్ష చతుర్విధఫల పురుషార్థసిద్ధ్యర్థం। శ్రీకృష్ణ దేవతా ముద్దిశ్య। శ్రీకృష్ణ ప్రీత్యర్థ్యం– సంభవద్భిః ద్రవ్యై సంభవద్భిః పదార్థైః సంభవతా నియమేన యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥** (ఉదకమును తాకవలెను)

అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణపతి పూజాం కరిష్యే॥

## గణపతి పూజ

(గణపతిచెంత అరటిపండుగాని, బెల్లమునుగాని ఉంచి సమస్కరించుచు)

విఘ్నేశ్వరాయ విద్మహే వక్రతుండాయ ధీమహి।

తన్నో ప్రసన్నః ప్రచోదయాత్॥

లం– పృథ్వీ తత్త్వాత్మనే– గంధం సమర్పయామి।

హుం- వాయు తత్త్వాత్మనే- పుష్పం సమర్పయామి।
యం- వాయు తత్త్వాత్మనే- ధూప మాఘ్రాపయామి।
రం-తేజస్తత్త్వాత్మనే- దీపం దర్శయామి।
వం- అమృత తత్త్వాత్మనే- నైవేద్యం సమర్పయామి।
సం- సర్వతత్త్వాత్మనే - సర్వోపచార పూజాం సమర్పయామి।
గణేశాయ విద్మహే । గణపతి ధీమహి। తన్నో ప్రసన్నప్రచోదయాత్॥

**శ్లో॥ వక్రతుండ మహాకాయ - సూర్యకోటి సమప్రభమ్।**
**అవిఘ్నం కురుమేదేవ - సర్వకార్యేషు సర్వదా॥**
**గణాధిపతి సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు॥**
**మమ ఇష్ట కామ్యార్థ ఫలసిద్ధిరస్తు। తదంగ కలశారాధన కరిష్యే॥**

(ఉదకము వదలవలయును. సంకల్ప ఆచమనాదులకు వాడినపాత్రను ఉదకమును కలశారాధనమునకు వినియోగించరాదు. స్వామికి కుడివైపును కలశముంచి దానికి కుంకుమ గంధాక్షతలు మూడచోట్ల బొట్లుంచి కలశమందు పుష్పముంచి ఈ క్రింది శ్లోకమును చెప్పవలెను)

## కలశారాధనము

**శ్లో॥ కలశస్య ముఖేవిష్ణుః- కంఠే రుద్ర స్సమాశ్రితః।**
**మూలే తత్రస్థితో బ్రహ్మా- మధ్యే మాతృ గణా స్మృతా॥**

**శ్లో॥ కుక్షౌతు సాగరా స్సర్వే- సప్తద్వీపా వసుంధరా।**
**ఋగ్వేదోஉథ యజుర్వేద- స్సామవేదో హ్యథర్వణః।**
**అంగైశ్చ సహితా స్సర్వే- కలశాంబు సమాశ్రితాః॥**

(కలశమును నీటితోనింపి దానియందు తులసీదళమును గాని, పుష్పమునుగాని, తమలపాకునుగాని, ఉంచి కలశముపై చేతిని ఉంచి ఈ క్రింది శ్లోకములనుచెప్పవలెను)

**శ్లో॥ గంగేచ యమునేచైవ - గోదావరి సరస్వతీ।**
**నర్మదే సింధుకావేరి- జలేస్మిన్ సన్నిధింకురు॥**

**శ్లో॥ కావేరీ తుంగభద్రా చ- కృష్ణవేణీ చ గౌతమీ।**
**భాగీరథీ చ విఖ్యాతాః - పంచగంగాః ప్రకీర్తితా॥**

(కలశోదకమును స్వామి వారి మీదను పూజాద్రవ్యముల మీదను తనపైనను చల్లవలెను.)

## ప్రాణప్రతిష్ఠ

(ఉదకమును చల్లుచూ ఈ క్రింది మంత్రమును ముమ్మారు చెప్పవలెను)

ఓం ప్రాణస్య శివః ప్రాణేశ స్వాహా॥

## శ్రీకృష్ణ ధ్యానమ్

**శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం**
**విశ్వాధారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగమ్।**
**లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం**
**వందే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్॥**

(ఓం శ్రీ కృష్ణాయనమః ధ్యాయామి)

## ఆవాహనం

**ఆవాహయామి దేవేశం శ్రీపతిం శ్రీధరం హరిమ్।**
**శ్రీవత్సవక్షసంలోలం నీలోత్పలదళం శివమ్॥**

( ఓం కృష్ణాయనమః ఆవాహయామి)

## ఆసనం

**దామోదర నమస్తేఽస్తు నారాయణ నమోఽస్తుతే।**
**రత్నసింహాసనం చారు గృహ్యతాం కరుణాకర**

(ఓం కృష్ణాయనమః ఆసనం సమర్పయామి)

## పాద్యం

**పుష్పాక్షత సమాయుక్తం పురుషోత్తమ వల్లభ।**
**పాద్యం గృహాణ దేవేశ పూర్ణరూప నమోస్తుతే॥**

ఓం కృష్ణాయ నమః పాదయోః పాద్యం సమర్పయామి

## అర్ఘ్యం

**పరిపూర్ణ పదానంద నమో రామాయ వేధసే।**
**గృహాణార్ఘ్యం మయాదత్తం కృష్ణవిష్ణో జనార్ధన॥**

ఓం కృష్ణాయనమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి

## ఆచమనీయం

**నానానదీ సమానీతం సువర్ణ కలశస్థితమ్।**
**గృహాణచమనార్థాయ విమలం జలమచ్యుత॥**

ఓం కృష్ణాయనమః ముఖే ఆచమనీయం సమర్పయామి

## పంచామృత స్నానం

**పంచామృతం గృహాణేశ పయో దధిఘృతం మధు।**
**శర్కరామపి గోవింద శకటాసుర భంజన॥**

ఓం కృష్ణాయనమః పంచామృతస్నానం సమర్పయామి

## శుద్ధోదక స్నానం

**గంగా గోదావరీ కృష్ణా యమునాభ్యః సమాహృతమ్।**
**సలిలం విమలం శుద్ధం స్నానార్థం ప్రతిగృహ్యతామ్॥**

ఓం కృష్ణాయనమః శుద్ధోదకస్నానం సమర్పయామి

## వస్త్రం

**పీతాంబరమిదం దేవ గృహాణ సుమనోహరమ్।**
**దేహిమే సఫలాన్ అర్థాన్ దేవకీ ప్రియనంద॥**

ఓం కృష్ణాయనమః వస్త్రయుగ్మం సమర్పయామి

## యజ్ఞోపవీతం

**ఉపవీతం గృహాణేందం కాంచనం కమలాపతే।**
**పవిత్రం పాహిమాం దేవ నమస్తే పురుషోత్తమ్॥**

ఓం కృష్ణాయనమః యజ్ఞోపవీతం సమర్పయామి

## చందనం

**గంధం కుంకుమ కస్తూరీ ఘనసార సమన్వితమ్।**
**గృహాణత్వం మహాబాహో కుబ్జానుగ్రహకారిణే॥**

ఓం కృష్ణాయనమః చందనం ధారయామి

## అక్షతలు

**అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ ముక్తాఫల సమప్రభాన్।**
**వాసుదేవ గృహాణ త్వం నమస్తే భక్తవత్సల॥**

ఓం కృష్ణాయనమః అక్షతాన్ సమర్పయామి

## ఆభరణం

**హారనూపుర కేయూర కింకిణీం దామపూర్వకమ్।**
**గృహాణాభరణం సర్వం శరణాగతవత్సల॥**

ఓం కృష్ణాయనమః నానా ఆభరణాని సమర్పయామి

## పుష్పం

**జాజీ చంపక పున్నాగ కేతకీ మల్లికాదిభిః।**
**కుసుమైః పూజయామిత్వాం సుదామ పరిపూజిత॥**

ఓం కృష్ణాయనమః పుష్పాణి సమర్పయామి

## -: అథాంగపూజ :-

ఓం అనఘాయ నమః పాదౌ పూజయామి

ఓం గోపాలాయ నమః గుల్ఫౌ పూజయామి

ఓం జన్మరహితాయ నమః జానునీ పూజయామి

ఓం పూతనావైరిణే నమః జంఘే పూజయామి

ఓం శకటాసురభంజనాయ నమః కటిం పూజయామి

ఓం నవనీత ప్రియాయ నమః నాభిం పూజయామి

ఓం ఉత్తాలతాలభేత్త్రే నమః ఉదరం పూజయామి

ఓం వనమాలినే నమః వక్షం పూజయామి

ఓం చతుర్భుజాయ నమః హస్తాన్ పూజయామి

ఓం కంసారయే నమః కంఠం పూజయామి

ఓం మధురానాథాయ నమః ముఖం పూజయామి

ఓం సంపత్ ప్రదాయ నమః కపోలౌ పూజయామి

ఓం కంజలోచనాయ నమః కర్ణౌ పూజయామి

ఓం లలితాకృతయే నమః లలాటం పూజయామి

ఓం శుకసంస్థితాయ నమః శిరః పూజయామి

ఓం జ్ఞానాత్మనే నమః అలకాన్ పూజయామి

ఓం సర్వేశ్వరాయ నమః సర్వాణ్యంగాని పూజయామి

## శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళిః

ఓం కృష్ణాయ నమః
ఓం కమలనాథాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం సనాతనాయ నమః
ఓం వసుదేవాత్మజాయ నమః
ఓం పుణ్యాయ నమః
ఓం లీలామానుషవిగ్రహాయ నమః
ఓం శ్రీవత్సకౌస్తుభ ధరాయ నమః
ఓం యశోదావత్సలాయ నమః
ఓం హరయే నమః
ఓం చతుర్భుజాత్తచక్రాసి గదా
ఓం శంఖద్యాయుధాయ నమః
ఓం దేవకీనందనాయ నమః
ఓం శ్రీశాయ నమః
ఓం నందగోప ప్రియాత్మజాయ నమః
ఓం యమునావేగ సంహారిణే నమః
ఓం పూతనాజీవితహరాయ నమః
ఓం శకటాసురభంజనాయ నమః
ఓం నందవ్రజనానందినే నమః
ఓం సచ్చిదానంద విగ్రహాయ నమః
ఓం నవనీత విలిప్తాంగాయ నమః
ఓం నవనీత నటాయ నమః
ఓం అనఘాయ నమః

ఓం నవనీతనవాహారాయ నమః
ఓం ముచికుందప్రసాదకాయ నమః
ఓం షోడశస్త్రీసహస్రేశాయ నమః
ఓం త్రిభంగినే నమః
ఓం మధురాకృతయే నమః
ఓం శుకవాగామృతబ్ధీందవే నమః
ఓం గోవిందాయ నమః
ఓం యోగినాంపతయే నమః
ఓం వత్సవాట చరాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం ధేనుకాసురభంజనాయ నమః
ఓం తృణీకృతతృణావర్తాయ నమః
ఓం యమళార్జునభంజనాయ నమః
ఓం ఉత్తలతాలభేత్త్రే నమః
ఓం తమాలశ్యామలాకృతయే నమః
ఓం గోపగోపీశ్వరాయ నమః
ఓం యోగినే నమః
ఓం కోటిసూర్యసమప్రభాయ నమః
ఓం ఇలాపతయే నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం యాదవేంద్రాయ నమః
ఓం యాదూద్వహాయ నమః
ఓం వనమాలినే నమః

ఓం పీతవాసనే నమః
ఓం పారిజాతపహారకాయ నమః
ఓం గోవర్ధనాచలోద్ధర్త్రే నమః
ఓం గోపాలాయ నమః
ఓం సర్వపాలకాయ నమః
ఓం అజాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం కామజనకాయ నమః
ఓం కంజలోచనాయ నమః
ఓం మధుఘ్నే నమః
ఓం మధురానాథాయ నమః
ఓం ద్వారకానాయకాయ నమః
ఓం బలినే నమః
ఓం బృందావనాంతస్సంచారిణే నమః
ఓం తులసీదామభూషణాయ నమః
ఓం స్యమంతకమణేర్హర్త్రే నమః
ఓం నరనారాయణాత్మకాయ నమః
ఓం కుబ్జాకృష్ణాంబరధరాయ నమః
ఓం మాయినే నమః
ఓం పరమపురుషాయ నమః
ఓం ముష్టికాసురచాణూర
మల్లయుద్ధ విశారదాయ నమః
ఓం సంసారవైరిణే నమః
ఓం కంసారయే నమః
ఓం మురారయే నమః
ఓం నరకాంతకాయ నమః
ఓం అనాదిబ్రహ్మచారిణే నమః
ఓం కృష్ణావ్యసనకర్శకాయ నమః
ఓం శిశుపాల శిరశ్ఛేత్రే నమః
ఓం దుర్యోధనకులాంతకాయ నమః
ఓం విదురాక్రూరవరదాయ నమః
ఓం విశ్వరూపప్రదర్శకాయ నమః
ఓం సత్యవాచే నమః
ఓం సత్యసంకల్పాయ నమః
ఓం సత్యభామారతాయ నమః
ఓం జయినే నమః
ఓం సుభద్రాపూర్వజాయ నమః
ఓం జిష్ణవే నమః
ఓం భీష్మముక్తిప్రదాయకాయ నమః
ఓం జగద్గురవే నమః
ఓం జగన్నాథాయ నమః
ఓం వేణునాదవిశారదాయ నమః
ఓం వృషభాసురవిధ్వంసినే నమః
ఓం బాణాసురనరకాంతకాయ నమః
ఓం యుధిష్ఠిర ప్రతిష్ఠాత్రే నమః
ఓం బర్హిబర్హావతంసకాయ నమః
ఓం పార్థసారథయే నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం గీతామృతమహోదధయే నమః
ఓం కాళీయఫణిమాణిక్యరంజిత
శ్రీపదాంబుజాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం యజ్ఞభోక్త్రే నమః
ఓం నారాయణాయ నమః
ఓం పరబ్రహ్మణే నమః
ఓం పన్నగాశనవాహనాయ నమః
ఓం జలక్రీడాసమాయుక్త గోపీవస్త్రాప
హారకాయ నమః
ఓం పుణ్యశ్లోకాయ నమః
ఓం తీర్థపాదాయ నమః
ఓం వేదవేద్యాయ నమః
ఓం దయానిధయే నమః
ఓం సర్వతీర్థాత్మకాయ నమః
ఓం సర్వగ్రహరూపిణేపరాత్పరాయ నమః

## ధూపం

**ధూపం గృహాణవరద దశాంగేన సువాసితమ్।**
**గురుడధ్వజ గోవింద గోవర్ధనధరాఽవ్యయ॥**

ఓం కృష్ణాయనమః ధూపమాఘ్రాపయామి

## దీపం

**సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినాయోజితం మయా।**
**గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్॥**
**భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయపరమాత్మనే।**
**త్రాహిమాం నరకద్ఘోరాత్ దివ్యజ్యోతి ర్నమోస్తుతే॥**

ఓం కృష్ణాయనమః సాక్షాత్ దీపం దర్శయామి ధూప దీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

## నైవేద్యం

**ఇదం దివ్యాన్న మమృతం రసైష్షడ్భిస్సమన్వితమ్।**
**లేహ్యం పేయం చ నైవేద్యం మాధవప్రతిగృహ్యతామ్॥**
**పుండరీకాక్ష గోవింద వాసుదేవ జనార్ధన ।**
**మయూర్పితాని ద్రవ్యాణి పవిత్రం కురుమే సదా॥**
**ఓం కృష్ణాయనమః। నైవేద్యం నివేదయామి**
**ఓం భుర్భువస్సువ। తత్సవితుర్వరేణ్యం।**
**భర్గోదేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్॥**
**సత్యం త్వర్తేన పరిషించామి। అమృతమస్తు అమృతోపస్తరణమసి స్వాహా**
**ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయ స్వాహా**
**ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయ స్వాహా॥**

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి. హస్తౌప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి.

## తాంబూలం

**పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతమ్।**
**కర్పూరచూర్ణ తాంబూలం ప్రతిగృహ్యతామ్॥**
**ఓం కృష్ణాయనమః  తాంబూలం సమర్పయామి**

## నీరాజనం

**మంగళం శ్రీకురుక్షేత్ర రణక్షోణి విహారిణే।**
**పార్థసారథి రూపాయ గీతాచార్యాయ మంగళమ్॥**
**మంగళం భగవన్ విష్ణో మంగళం వృషభధ్వజ।**
**మంగళం పుండరీకాక్ష మంగళం గరుఢధ్వజ॥**

ఓం కృష్ణాయనమః ఆనంద కర్పూర మంగళనీరాజనం సందర్శయామి

## మంత్రపుష్పం

**1. ఓంనారాయణాయవిద్మహే।వాసుదేవాయ ధీమహి।తన్నోవిష్ణుః ప్రచోదయాత్॥**
**2. ఓం దేవకీ నందనాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నః కృష్ణః ప్రచోదయాత్॥**

ఓం కృష్ణాయ నమః మంత్రపుష్పం సమర్పయామి

## ప్రదక్షిణ నమస్కారం

**యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ। తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణే పదే పదే అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ। తస్మాత్ కారుణ్యభావేన రక్షరక్ష జనార్ధన॥**

ఓం కృష్ణాయనమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి

## పునః పూజ

**ఓం శ్రీకృష్ణాయ నమః ఛత్రం పూజయామి**
**ఓం శ్రీకృష్ణాయ నమః చామరం పూజయామి**
**ఓం శ్రీకృష్ణాయ నమః నృత్యందర్శపూజయామి**
**ఓం శ్రీకృష్ణాయ నమః గీతం శ్రావయామి**
**ఓం శ్రీకృష్ణాయ నమః అశ్వాన్ పూజయామి**
**ఓం శ్రీకృష్ణాయ నమః గజాన్ ఆరోహయామి**
**ఓం శ్రీకృష్ణాయ నమః ఆందోళికాం ఆరోహయామి**

ఓం కృష్ణాయనమః సమస్త రాజోపచార, దేవోపచార, భక్త్యోపచార, శక్త్యోపచార, పూజా సమర్పయామి. సర్వాభవే అక్షతాన్ సమర్పయామి.

## క్షమాప్రార్థన

**అపరాథ సహస్రాణి క్రియంతేఽహర్నిశం మయా।**
**దాసోఽహమితి మాం బుద్ధ్వా క్షమస్వ పురుషోత్తమ॥**

## అర్పణం

**దేవనాథ గురుస్వామిన్ దేశికస్మాత్మనాహితమ్।**
**త్రాహిత్రాహి కృపాసింధో పూజా పూర్ణఫలంకురు॥**
**యత్కృతం యత్కరిష్యామి తత్సర్వం న మయాకృతమ్।**
**త్వయాకృతంతు ఫలభుక్ త్వమేవ పురుషోత్తమ।**

అనయా ధానావాహనాది షోడశోపచార పూజాయచ భగవాన్ సర్వాత్మకః శ్రీకృష్ణస్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు॥

## శ్రీ కృష్ణాష్టకమ్

వసుదేవసుతం దేవం- కంసచాణూరమర్దనం
దేవకీపరమానన్దం - కృష్ణం వందే జగద్గురుమ్ **1**

అతసీపుష్పసంకాశం- హారసూపురశోభితం
రత్నకంకణకేయూరం - కృష్ణం వందే జగద్గురుమ్ **2**

కుటిలాలకసంయుక్తం- పూర్ణచంద్రనిభాననం
విలసత్కుండలధరం- కృష్ణం వందే జగద్గురుమ్ **3**

మన్దారగంధసంయుక్తం- చారుహాసం చతుర్భుజం
బర్హిపింఛాంగచూడాంగం- కృష్ణం వందే జగద్గురుమ్ **4**

ఉత్ఫల్లపద్మపత్రాక్షం - నీలజీమూతసన్నిభం
యాదవానాం శిరోరత్నం- కృష్ణం వందే జగద్గురుమ్ **5**

రుక్మిణీకేళిసంయుక్తం- పీతామ్బరసుశోభితం
అవాప్తతులసీగంధం- కృష్నం వందే జగద్గురుమ్ **6**

గోపికానం కుచద్వన్ద్వ- కుఙ్కుమాంకితవక్షసం
శ్రీనికేతం మహేష్వాసం- కృష్ణం వందే జగద్గురుమ్ **7**

శ్రీవత్సాఙ్కం మహోరస్కం- వనమాలావిరాజితం
శఙ్ఖ చక్రధరం దేవం- కృష్ణం వందే జగద్గురుమ్ **8**

కృష్ణాష్టక మిదం పుణ్యం- ప్రాతరుత్థాయ యః పఠేత్
కోటిజన్మకృతం పాపం- స్మరణేన వినశ్యతి **9**

# రుక్మిణీ కళ్యాణం

కాకుత్స వంశమునకు అలంకారమైనటువంటి వాడవు, ప్రజలను ఆనందపరుచు సుగుణమును కలిగిన రాజువు, ఇంద్రాది దేవతలందరునూ శ్లాఘించినటుల యుద్ధమొనరింపగల వాడవు, శివుని యొక్క ధనుస్సును విరచినటువంటి వాడవైన ఓ శ్రీరామచంద్రా! నీకు ప్రణతులు.

ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారము రైవతుడను మహా రాజు, రేవతీ అనే నామముగల కన్యకా మణిని గొనివచ్చి బలరామునకు ఇచ్చియు పెండ్లి గావించినాడు. ఈ విషయ మంతయునూ ఇంతకు పూర్వమే నీవు ఆలకించి యుంటివిగదా!

అటుల ఆ బలరాముని వివాహానంతరమే పూర్వము పక్షిరాజగు గరుత్మంతుడు దేవేంద్రునిపై జయమునొంది అమృతాన్ని తన స్వంతము చేసికొనినట్లుగ చేది దేశమును పరిపాలన చేయుచున్న శిశుపాలుని,అతని పక్షమును వహించి యున్న సాళ్వుడు ఆదిగాగల రాజులందరినీ జయించి చక్రాయుధము ధరించినవాడు, శుభకరుడూ అగు శ్రీకృష్ణుడు భీష్మక మహారాజు యొక్క కుమార్తెయగు రుక్మిణిని వివాహం చేసికొనినాడు. ఆ రుక్మిణీ పద్మమును పోలిన దేహపరిమళము గలదియై, లక్ష్మ్యంశతో జన్మించింది. అధిక సుగుణముల రాశి, కన్యలలో శ్రేష్ఠమైనది.

ఇటుల శుకయోగీంద్రులు వచించగా పరీక్షిన్మహారాజిట్లు పలికెను."ఓ మునీశ్వరా! గతములో గోవిందుడు స్వయంవరమున కేతెంచి ఆ రుక్మిణీ దేవిని రాక్షసవివాహ ప్రక్రియన తీసుకువెళ్ళెనని

జెప్పియుంటివి. అతనొక్కడే సాళ్వాది నరపతుల నోడించి ఏ విధముగ ద్వారకానగరమునకు ఆమెను తీసుకొని వెళ్ళినాడు?

విప్రోత్తమా! శుభప్రదములైన శ్రీహరి కథాశ్రవణమువల్ల మనోవికారాలన్నీ నాశనమౌతాయి. అంతటి ఆ గాథల నాలకిస్తూ 'ఇకచాలు' అని ఎవరు తృప్తి- నొందగలరు? ఆ గాథలు ఎన్ని పర్యాయాలు విన్నప్పటికీ నూతనంగానే ఉంటాయి. అందుచేత నాకు రుక్మిణీ కళ్యాణగాథ వినిపింపుము. వినాలని మనసునందు ఉబలాటముగా ఉన్నది.

గరుడవాహనుని యొక్క శుభగుణములను వర్ణించెడి సంభాషణలు కర్ణములకు ఆభరణములవంటివి. అవి పండితులకు ముదమును చేకూరుస్తాయి, జన్మజన్మల పాపాలను నశింపజేస్తాయి.

ఓ రాజా! వినుము. విదర్భదేశమునందు కుండిన అనే నగరముంది. దానిని భీష్మకుడనే రాజు పాలిస్తూండేవాడు, ఆయన వీరుడు, గొప్పరాజు, ఆయనకు ఐదుగురు పుత్రులు, జ్యేష్ఠుడు రుక్మి,అతడు నీతిమాలినవాడు. ఈ ఐదుగురు పుత్రుల పిమ్మట ఆ రాజుకు ఒక పుత్రిక జన్మించింది. ఆమె 'రుక్మిణి' అన్నపేరుతో పేరుగాంచింది.

నెలపొడుపువలన పశ్చిమదిశ శోభిల్లినటుల రుక్మిణి జన్మించి పెరుగు తూండగా ఆ భీష్మక మహారాజు మందిరం దేదీప్యమానమై వెలుగొందింది.

ఆ విధంగా రుక్మిణీ దినదిన ప్రవర్ధమానురాలవుతూ, బొమ్మలకు పేర్లుపెట్టి పెళ్ళిళ్ళు చేస్తూ తోటిబాలికలతో వియ్యము చేస్తూ ఉండేది. పప్పు, బియ్యాలను గిన్నెలయందుపోసి కమ్మనైన

గుజ్జనగూళ్ళను వండి తన స్నేహితురాండ్రకు వడ్డించేది. అంద మైన ఉద్యానవనములందలి పుష్పలతలకు నీరుపోసి ఎరువువేసి, పందిళ్ళు నిర్మించి, పోషణ గావించేది. స్వచ్ఛమైన మణిమయ భవంతులలో బంగారపు ఉయ్యాలలో ఊగుతూ ఉండేది. చీలక లకు, గోరువంకలకు మాటలను, నెమళ్ళకు నాట్యములు, హంస లకు నడక లనూ నేర్పుతూండేది.

దేవకీపుత్రు(శ్రీకృష్ణు)నకు రుక్మిణీని వివాహమాడవలెనన్న కోరిక కొనలు సాగినట్లుగ ఆమెకు సన్నని తీగవలె శరీరము పెరుగుతున్నది. గోవిందుని హృదయం వికసించిన రీతిగ ఆమెకు వదనసరోజము మిక్కిలి కాంతినొందింది. మాధవుని మనసులో ప్రేమ అధికమైనటుల ఆమెకు వక్షద్వయం బిగువైనది. శౌరికి ధైర్యం సన్నగలిగిన రీతిన ఆమెకు నడుము సన్ననయింది. పద్మనాభునకు అధికప్రేమ ఉన్నటుల రుక్మిణికి శిరోజముల వృద్ధి కాసాగింది. గోవిందునకు హృదయమునందు అధిక ముదము నందిన రీతిన ఆమెకు యవ్వనంవృద్ధి నొందినది.

ఇవ్విధమున రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహువు, రుక్మ కేశుడు, రుక్మనేత్రుడు, అనే ఈ ఐదుగురుకు తోబుట్టువైన రుక్మిణీ దేవికి తొలి యవ్వనంలో తన తండ్రి గృహమునకేతెంచుచున్న అతిథులవల్ల శ్రీకృష్ణుడైన రూప, బల, సద్గుణాలను ఆలకించి వుండుటవలన అతడే తనకు తగిన మగడని నిర్ణయించుకున్నది.

శ్రీకృష్ణుడునూ కన్యకామణియైన రుక్మిణియొక్క రూప, వివేక, సత్ప్రవర్తనాది, శుభలక్షణ, సద్గుణాలన్నీ, గ్రహించి ఆమెకు తప్పక వివాహము చేసికొనాలని నిర్ణయించుకొనినాడు.

ఈ విధంగా పరస్పరము వారు తీర్మానించుకున్న సమయంలో బంధువులందరూ కూడా రుక్మిణిని కృష్ణునకిచ్చి వివాహంగావించ నిశ్చయించు కొనినాడు. దుష్టస్నేహములు కల్గిన జ్ఞానరహితుడైన రుక్మి మాత్రము కృష్ణునిపట్ల విరోధభావం కలిగివున్నాడు. అతడు బంధువులను వారించి చక్కని శుభలక్షణ లక్షితయైన తన చెల్లిలిని చేది దేశాధిపతి అయిన శిశుపాలున కీయవలెనని సంకల్పించినాడు.

రుక్మిణీదేవి అన్నయొక్క దురాలోచన గ్రహించి రానున్న ప్రమాదమును ఊహించి మనసునందు మిక్కిలిగా వ్యధనొంది నది. తనశ్రేయమును వాంఛించే అగ్నిద్యోతనుడను బ్రాహ్మణును పిలిపించి అతనితో 'ఓ విప్రోత్తమా'! గర్వాంధుడైన నా అన్న రుక్మి నన్నిపుడు శిశుపాలున కిచ్చుటకు సంకల్పించి నాడు. ఎలాగైనా నీవు ద్వారక కేగి ఆ కృష్ణునకు నా పరిస్థితిని తెలిపి అతనిని ఇచటకు తప్పక పిలుచుకొని రమ్ము అని మరికొన్ని రహస్యములను అతనికి చెప్పి పంపింది.

ఆ పలుకులను విన్న అగ్నిద్యోతనుడు వెనువెంటనే ద్వారక కేగినాడు. తన ఆగమనాన్ని వార్తాహరులద్వారాలోపలికి పంపి కృష్ణ నివాసభవనాన్ని ప్రవేశించాడు. అక్కడ స్వర్ణభూషిత గద్దెపై అసీనుడైఉన్న కృష్ణుని గాంచి 'పెండ్లికుమారుడవు' కమ్మని ఆశీర్వదించినాడు. వెంటనే కృష్ణుడు ఆతని సర్వోపచారముల పూజించి, షడ్రసోపేత విందుభోజనం పెట్టించి, అతని ప్రక్కనుచేరి అతనికి పాదసేవచేస్తూ ఆ బ్రాహ్మణునితో "విప్రపుంగవా! నిత్యసంతోషివైన నీప్రవర్తన అనుసరణీయం. బ్రాహ్మణుడు అల్పసంతోషి. తన ధర్మాన్ని తాను నెరవేరుస్తాడు. ధర్మాతిక్రమణం చేయడు.

అట్టివానికి సమస్తమూ లభిస్తాయి. శాంతస్వరూపులు, గంధర్వ హితులూ, సమకూడిన దానితో సంతోషించే వారూ, అయిన సత్పురుషపులకు నేను అభివంద నం చేస్తాను. అర్యా! మీది ఏదేశం? మీ యోగక్షేమాలు విచారించే రాజెవరు? నీమనోవాంఛ ఏమిటో సెలవిమ్ము. తప్పక తీరుస్తాను" అన్నాడు.

అపుడు ఆ బ్రాహ్మణుడు వినయముతో "దేవా! విదర్భ దేశాన్ని పాలించే భీష్మకునకు రుక్మిణి అనే పేరుగల కూతురు ఉన్నది. మిమ్ములను వివాహ మాడగోరి ఈ శుభవార్త మీ కెరిగింప నన్ను నీవద్దకు పంపినది. సందేశాన్ని అలకించండి.

కంసాంతకా! నీ గుణ విశేషములు వినినచో శారీరక తాపా లన్నీ నశిస్తాయి. ఓ కళ్యాణ స్వరూపా! నీ దర్శనభాగ్యం నేత్రా నందకరము. నిరంతరం నీ పాదసేవనం లోకమందు మహోన్న తిని ప్రసాదిస్తుంది. నీ దివ్యనామస్మరణ మూల మున భవబం ధాలు, తొలగుతాయి. నీవు ధన్యుడవు. వంశము, విద్య, అందము, యవ్వనము, మంచితనము, సంపద, బలము, దానము, పరాక్రమము, కారుణ్యాలనే గుణ సంపదలతో శోభిల్లు తున్నావు. ఇట్టి నిన్ను ఏకన్యక వరించక వుండగలదు? స్త్రీలలో ఉత్తమురాలైన శ్రీమహాలక్ష్మి ఆనాడు నిన్ను చేపట్టలేదా? నేనొక్కతినే నిన్ను ప్రేమించానా ఏమి?

ఓ మంగళదాయకా! పురుషులందు సింహమువంటి వాడవైన నీకు చెందవలసిన నన్ను మదోన్మత్తుడైన ఆ శిశుపాలుడు త్వరితగతిన నన్నుహరింప ప్రయత్నిస్తున్నాడు. అల్పుడైన అతడు నీఘనపరాక్రమమును గూర్చి ఎరుగడుకదా!

పూర్వజన్మములయందు నేను లోకశుభంకరుడూ, ఆ జగన్నాయకుడూ అయిన గోవిందుని పతిగా వాంఛించి నోములు నోచిఉన్నచో దానధర్మాది పుణ్యకార్యాలు సల్పిఉన్నచో ఆ శ్రీకృష్ణుడు నాకు పతియగుతాడు. శిశుపాలాది నీచులు యుద్ధ మందు పరాజితులౌతారు.

ఓ పద్మనాభా! నీకిక్కడ ఆటంకమేమీలేదు. చతురంగ బల సమేతుడవై ఏతెంచి శిశుపాల జరాసంధులను ఉగ్రరణమునందు ఓడించి రాక్షసవివాహ పద్ధతిన నన్ను గొనిపొమ్ము. నేను నీవెంట వచ్చుటకు సిద్ధముగానే ఉన్నాను.

రుక్మిణీ! నీవు ఆంతరంగిక అంతఃపురమునందు ఉంటావు కదా? నిన్నేరీతిన గొనిపోగలను? ఆ విధముగ గొనిపోవలెనంటే నీ బంధు జనమునూ, అంతఃపుర రక్షకులను వధించవలసి వచ్చునుకదా! అని, నీరజాక్షా నీవు భావించిన ఈ రభసతో పనిలేని ఒక ఉపాయాన్ని మనవి చేసెద ఆలకించు. పెండ్లికి ముందుగా పెండ్లికూతురును మా ఇలవేల్పయిన ఆగౌరీదేవిని కొలిచేందుకై మావారునన్ను ఊరివెలుపల ఉన్న దుర్గగుడికి పంపుతారు. ఆ తరుణమునందు నన్ను నీవు నీవెంట గొనిపొమ్ము.

మహాత్ములు అజ్ఞానరాహిత్యానికై ఆపరమపురుషుని పాదపద్మముల యందు ద్భవించిన గంగాజలమునందు ఓలలాడ ఆశిస్తారో అట్టి తీర్థపాదుడ వైన నీ అనుగ్రహానికి నేను అర్హురాలను కాకున్నచో బ్రహ్మ చర్యనిష్టను బూని నూరుజన్మల కైనా నీవే నాపతివి కావాలని నిన్నే ధ్యానిస్తూ ప్రాణాల్ని నీకు అర్పితం చేస్తాను. ఇదే నామనోనిశ్చయం.

నీ మధురవాక్కులాలకించని చెవులవల్ల ప్రయోజనంలేదు. నీ వనుభవింపని ఈ శరీరలావణ్యం ఎందుకూకొరగాదు. నీ అధరసుధార సమాస్వాదింపని నాలుకకు ఫలరసాదుల ప్రాప్తి ఎందుకు? నీ పాదచర్య కుపకరించని ఈ జన్మ ఎన్ని జన్మలెత్తినా లాభశూన్యము?

ఈ రీతిన అగ్నిద్యోతుడు ఆ రుక్మిణీదేవి పంపిన సందేశ విశేషాలను కృష్ణునకు విన్నవించి. “కర్తవ్యాన్ని మీరే యోచించాలి” అని అతడు మరల రుక్మిణీదేవిని గూర్చి ఇలా వర్ణిస్తాడు.

రుక్మిణీదేవి చరణాలు, చిగురుటాకుల అందాన్ని మించు తాయి. బంగారపు అరటిబోదెల మాదిరిగా ఆమెతొడలు శోభి స్తాయి. శంఖం మాదిరి ఆమె కంఠం మిక్కిలి అందమైనది. నడుము ఉందాలేదా అనిపిస్తుంది. వక్షద్వయం కనులపండుగ గావిస్తుంది. నెన్నుదురు నెలవంకను అపహాస్యం చేస్తుంది. చూపులు మన్మధబాణాలు వాక్కులు, మనస్సంతోష సంధాయ కాలు. వదనం చంద్రబింబం.

కృష్ణా! మా పెద్దలపై ప్రమాణమొనరించి చెబుతున్నాను. నీవూ రుక్మిణీ ఈడూజోడై ఉంటారు. మీకు తప్పక వివాహం జరుగుతుంది. ఆలస్యమిక ఎందులకు? నీవు నీవారితో కలిసి ఆమెనుగొనినేని వెంటనే ఉపక్రమించు. శత్రువర్గాన్ని అణచివేసి, లోకానికి హితమును చేకూర్చుము.

## శ్రీకృష్ణుడు రధారూఢుడై కుండిన నగరమునక కేగుట

ఈ రీతిన పలుకుతున్న ఆ విప్రవునివల్ల విదర్భ రాజు కుమారి పంపిన వార్త, ఆమె రూప, లావణ్యములను చేయి పట్టుకొని అతనితో ఓ పురుషోత్తమా! రుక్మిణిపై నాకు మిక్కిలి

కోరిక రుక్మిణి పెండ్లికి ఓర్చలేక దురాలోచనతో వున్నాడని నాకు ముందే తెలియును. ఆ శత్రువర్గాన్నిఛేదించి కన్యకామణిని గైకొందును.

నేను విదర్భకేతెంచి కుండిన నగరముందు ప్రవేశించి క్షణంలో రుక్మిణీని తెస్తాను. విరోధులెవరైనా అడ్డగిస్తే వారిని యుద్ధంలో హత మారుస్తాను.

కృష్ణుడీవిధంగా పలికి వివాహముహూర్తసమయం అగ్నిద్యోతనుని ద్వారా తెలుసుకొన్నాడు. తన ఆజ్ఞానువర్తియైన సారధి దారుకుడు శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహక అనే నాలుగు గుఱ్ఱాలను ఉంచిన రథాన్ని అధిరోహించి అగ్నిద్యోతనుని వెంటనిడుకొని ఏకరాత్రి పయనించి విదర్భకు విచ్చేశాడు. అక్కడ రాజైన భీష్మకుడు కుమారునకు లోబడి తన కుమార్తెను శిశుపాలునకిచ్చుటకు అంగీకరించిన శుభకార్య ప్రయత్నా లొనరింపసాగాడు.

నగరమంతటినీ అలంకరించి, మంచిగంధాన్ని కలిపిన నీటిని అంతటనూ చల్లినారు. పలువిధములైన పుష్పతోరణాలు కట్టినారు. ఇండ్లనన్నిటినీ శుభ్రపరిచి కర్పూర, కుంకుమలతో రంగవల్లులను తీర్చినారు. పలు మంగళ వాయిద్యాలను ముద మార ప్రయోగించారు. పట్టణమంతా అధికమగు వైభవంతో శోభిల్లింది.

పిమ్మట భీష్మకుడు శాస్త్రోక్తరీతిన పితృదేవతాపూజల నొనర్చి భూసురుల పూజించి వారలచే మంగళాశీర్వాదములను పఠింపచేశాడు. రుక్మిణికి అభ్యంగన స్నానమొనరింపచేసి ఆమెను వస్త్రాభరణములతో అలంకరింప జేశాడు. బ్రాహ్మ ణులు

చతుర్వేద సహిత మంత్రాలతో స్వస్తి పుణ్యాహావాచనలు చేసి వివాహ మహోత్సవం నిర్విఘ్నంగా సాగేందుకు రక్షాకరణములు గావించినారు. గ్రహ శాంతికై వేదోక్త విధానహోమమును పురోహితులు చేశారు. రాజు నూతన దంపతుల క్షేమమునకై నువ్వులు, గోవులు, సువర్ణ రజతములు, వస్త్రములు, బ్రాహ్మణులకు దానమొనరించినాడు.

బంధుసహితులైన బలరామకృష్ణులను తరిమికొట్టి ఎట్టి ఆటంకమూ లేకుండా రుక్మిణిని శిశుపాలునకిచ్చి వివాహం చేస్తామని జరాసంధ, దంతవక్త్ర, సాళ్వ, విదూరక, మొదలైన వారు చతురంగ బలాలతో ఏతెంచారు. మరియు పలుదేశాల రాజులు అనేకులు వచ్చారు. భీష్మకుడు శిశుపాలున కెదురేగి తగినరీతినిపూజించి అతనికి తగిన విడిదిని ఏర్పరచాడు. ఈ సమాచారాన్ని బలరాముడు విన్నాడు.

కృష్ణుడొక్కడే వెళ్ళినాడు, శిశుపాలునకు జరాసంధుడు, అనేకులైన రాజులు సహాయంగా ఉన్నారు. కన్యకను గొనివచ్చేటప్పుడు యుద్ధం జరుగుతుంది. మహాత్ముడైన శ్రీకృష్ణునికి సహాయపడవలెనని హలధారుడైన బలరాముడు అసంఖ్యాక సైన్యముతో బయలుదేరి విచ్చేసినాడు.

ఆ సమయమున రుక్మిణీ ఏకాంతమందిరమున కూర్చుని ఆ యదు వల్లభుడు తనను చేరరాడేమోనను సందేహముతో అంతరంగమందు ఆందోళన చెందసాగింది.

సుముహూర్తము మరునాటి దినమే. వివాహము దగ్గర పడుతున్నది. కృష్ణడెందుకు రాలేదు? నామనసు ఆందోళన పడుతున్నది. ఆయనకు వార్త చేదినదో లేదో? దైవ నిర్ణయమెలా ఉందో ఏమో?

ఆ విప్రోత్తముడు ద్వారకకు వెళ్ళెనో? లేదో? మార్గమధ్య మందే నిలచిపోయెనో? కృష్ణుడు నా సందేహాన్ని విని తప్పుగా భావించినాడేమో? లేక ఇచటకే వచ్చియుండెనో? పరమేశ్వరుడీ కార్యమున కనుకూలించునో? లేదో? గౌరీమహాదేవి నన్ను కాపాడునో? లేదో? ఇంతకునూ నా అదృష్టమెటులున్నదో ఏమో?

ఈ రీతిన పలురకాలుగా యోచిస్తుంది. అగ్నిద్యోతనుడు ద్వారకాపురి కసలు వెళ్లిఉండడు. కనుకనే శ్రీకృష్ణుడు రాలేదని సందేహిస్తుంది. అన్న నీతిమాలి తనను శిశుపాలునకిచ్చేందుకు సిద్ధపడినాడని విచారిస్తుంది. పరమేశ్వరికి తనపై నేడు కృప తప్పిందని చింతిస్తుంది.

ఆ రుక్మిణీ తన మనోవేదనను తల్లికి చెప్పదు. దిక్కుల యందు చిరునవ్వు వెన్నెలలు చిందింపదు. ముఖపద్మసౌరభానికి ముసురుతున్న తుమ్మెదల గుంపును తోలదు. నిద్రపోదు. వక్షస్థలమందు మెలిపడిన ముత్యాలదండ చిక్కుసడలింపదు.

కనులనుండి కారే కన్నీటి బొట్లు తుడువదు, కొప్పు చక్కగా సవరించుకోదు. స్నేహితురాలితో ముచ్చటింపదు. అన్నమును అసలు ఆరగింపదు. మంచినీరైనా ముట్టదు. చెలికత్తెలను చేరదు. వీణాతంత్రులను వీటుతూ ఆనందింపదు.

మురళీధరుడు తన మొరాలకించి తనను గైకొనరాడాయె? ఒంటికి కస్తూరి పూసికొనదు. జడలో పువ్వులనలంకరింపదు. జలక్రీడలాడదు. నుదుట తిలకమును దిద్దదు.

ఈ విధముగా రుక్మిణీదేవి మదనాగ్ని జ్వాలలలో ద్రుగ్గెడి శరీరముగలదై, మందమారుతాన్ని అంగీకరించక కోయిల

కూతకు కోపాన్ని వహిస్తుంది. వెన్నెల వేడికి కలత చెందుతుంది. గున్నమామిడి నీడలకు దూరముగా వెడుతుంది.

ఇటుల ఆ పద్మాక్షుని రాకకై ఎదురుచూస్తూ అవసర కృత్యాలపై కూడా కోరిక లేక మన్మధాగ్నితో క్రగ్గెడి ఆమెకు శుభశూచకంగా ఎడమకన్ను, ఎడమభాగం అదిరాయి. అచ్యుతుని ఆజ్ఞానువర్తియై శీఘ్రమేవచ్చిన అగ్నిద్యోతనుని ముఖలక్షణాల గమనించిన రుక్మిణి మందస్మితయై అతని కెదురేగింది. అపుడాతను ఆమెతో!

"ఓ బాలామణీ! నీ సద్గుణాలను ఆ సుదర్శనాయుధుడు మెచ్చుకున్నాడు. నాకు అమిత ధనరాసులనొసంగినాడు. ఇదిగో ఇపుడే విచ్చేసినాను. దేవదానవులు ఏకమై అడ్డువచ్చినప్పటికీ రాక్షసవివాహరీతిన నిన్ను గొనిపోతాడు. నీ సత్ప్రవర్తన, అదృష్టము, నేటికి ఫలించినవి తల్లీ"! అని అన్నాడు.

అగ్నిద్యోతనుని పలుకులు వినిన ఆమె అతనితో "బ్రాహ్మణ వంశ శ్రేష్ఠుడా! నా సందేశాన్ని శ్రీకృష్ణుని తోడ్కొని వచ్చితివి. నన్ను ప్రాణాలతో నిలిపితివి. నీవంటి పుణ్యాత్ములీపుడమియందు లేరు. నీవొనర్చిన ఈ ఉపకారమునకు ప్రత్యుపకారమేమి చేయాలో ఎరుగని దానను నేను. ఓ భూసురోత్తమా! నీకు దోసిలొగ్గి ప్రణమిల్లు తాను" అని పలికినది.

అంత భీష్మకుడు బలరామకృష్ణులు తన కుమార్తె వివాహమున కేతెంచిరని తెలిసి మంగళవాయిద్యములతో ఎదురేగి శాస్త్రోక్తరీతిన వారిని సత్కరించి, మధుపర్కాలిచ్చి, పలురకాలైన ఆభరణాలు, సమర్పించాడు. బంధుమిత్ర సైన్యసమేతులైన ఏతెంచిన ఆ రామకృష్ణులకు వెంటనే సమస్త సౌకర్య సహితమైన

విడుదులనేర్పాటు చేశాడు. ఈ విధముగా అచటకేతెంచిన రాజులందరికీ వారు ఆశించిన వస్తుసముదాయాన్ని సమకూర్చి వారందరినీ ఆదరించాడు భీష్మకుడు. ఆ విదర్భనగర ప్రజలు శ్రీకృష్ణుడు రాకను విని వచ్చి తన సౌందర్యాని ఆస్వాదిస్తూ! "ఈ చక్రి విదర్భరాజు తనయకు తగినవాడు. ఆహా! ఎంత చక్కని దాంపత్యం! వీరల నిరువురినీ అలుమగలుగా ఆలుమగలుగా జతకూర్చిన ఆ బ్రహ్మ ఎంతనేర్పరి! ఈ చక్రాయుధుడు శత్రువుల పారద్రోలి మా రాకుమారిని వివాహమాడుగాక! అని వారందరూ అలా భావిస్తున్న తరుణంలో ఫాలభాగమునందు ముంగురులు ముసరగా, రుక్మిణీదేవి, గౌరీదేవిని అర్చించుటకై అంతః పురము నుండి బయలుదేరింది. కవచధారులైన వీరభటులు పలురకాల ఆయుధాలు ధరించి ఆమెను పరివేష్టించి నడచినారు. బ్రాహ్మణ సువానిసినులు పూలుపెట్టుకుని, చందనము పూసుకొని, నూతన వస్త్రములను ధరించి బంగారు ఆభరణములను ధరించి పాటలు పాడుతూ ఆమె ననుసరించారు. చెలికత్తెలు, దాసీలు, బంధువులు, ఆమెను వెంబడించారు.

సూత, వందిమాగధులు, గాయకాదులు, కైవారములు గావిస్తుండగా రుక్మిణిని ఆ గోవిందుని పాదపద్మములను హృదయ మందు స్మరిస్తూ మందగమనయై అంబికాలయానికి వచ్చింది. కాలుసేతులు కడుగుకొని పరిశుద్ధురాలైన పరమేశ్వరీ సన్నిధికేగగా బ్రాహ్మణముత్తైదువులు పరమేశ్వర సహితంగా భవానికి అభిషేకం గావించారు. గంధాక్షతలు సమర్పించి పుష్ప, వస్త్రాభరణాలతో అమ్మవారిని అలంకరించారు. ధూపదీపాలిచ్చి పలురకాలైన పిండి వంటలతో నైవేద్యమిడి కానుకలర్పించిరి. అనంతరం రుక్మిణీ దేవిని దుర్గాదేవికి మొక్కించారు.

అపుడు రుక్మిణీదేవి భవానిని "అమ్మా! గౌరీ శాశ్వతులూ, ఆదిదంపతులూ అయిన పార్వతీపరమేశ్వరులను మిమ్ము మదియందు నమ్మికొని యుంటిని, భక్తితో సేవించుచుంటిని. అమ్మలందు నీవు మేటివి, దయకు సముద్రము వంటిదానవు. కృష్ణుని నాకు భర్తను గావించుము తల్లీ! నిన్ను నమ్మినవారికెన్నడూ నష్టమనునది లేదుగదా!" అని వేడుకొంటూ ఆమె దుర్గాదేవికి నమస్సులు అర్పించి భర్తృసమేతులైన బ్రాహ్మణసతులకు ఉప్పు, అప్పములు,తాంబూలములు, మంగళ సూత్రములు, చెరకుగడ లను వచ్చి పూజగావించినది.

ఆ ముత్తయిదువలు ఉత్సాహమున దీవించి రుక్మిణీదేవి శిరముపై అక్షతలనుంచారు. ఆ మంగళాక్షలను ధరించి ఆమె శివకామినికి వందనమొనరించి మౌనముగా గుడినుండి బయటకు వెడలినది.

ఈ విధముగా వెడలిన రుక్మిణి మబ్బులమధ్యనుండి వెలువడి ప్రకాశించెడి తొలకరి మెరుపువలెనున్నది. చంద్ర మండలం నుండి వెడలివచ్చి సంచరించు హరిణమువలె నున్నది. బ్రహ్మదేవుడనెడి నటుడెత్తిన తెరమరుగుబాసి రంగమున సాక్షాత్క రించిన మోహిని దేవతవలెనున్నది. వాసుకి అనే సర్పరాజు కవ్వపుత్రాడు గను, మందరగిరిని కవ్వముగాను చేసి సురాసురులు చిలికెడివేళ ఘుమఘుమ ధ్వనులతో నిండిన మహాసాగర మధ్యమునుండి ఏతెంచిన రమా రమణివలె విరాజిల్లింది. ఈ విధంగా పలుకాంతుల విలసిల్లుతూ రుక్మిణి కాళికాలయం నుండి బయలుదేరింది. మానస సరోవరము నందు పసిడి తామరల గుంపులో విహరించే హంసవలె ఆమె మెల్లగా తూలుతున్న

నడుముగల రాకుమారి రత్నాంగుళీయకముతో విరాజిల్లెడి హస్తముతో అనుంగుచెలి హస్తం పట్టుకొంది. ఆమె దొండపండు వంటి అధర అరుణకాంతులు మల్లిమొగ్గల వంటి దంతాలకు ఎఱ్ఱదన్నాన్ని చేకూరుస్తున్నాయి. కందర్పుడు ఒకనుండి పైకితీసి పదును పెట్టి జళిపించిన వేళ తళుకుతళుక్కుమని మెరిసేవాడి తూంపుల మాదిరి ఆమె సుందర మైన చూపులు వీరిధీవీరులైన రాజులగుండెలను చెండివేస్తున్నాయి. అందమైన కాలిఅందెల రవళి, చెవులకు విందుసేయగా, ఆ సుందరి ముకుందుని రాకకై ప్రతీక్షిస్తూ వీరమోహినియై కాలినడకతో వస్తున్నది.

తుమ్మెదల వంటి నల్లనైన ముంగురులు, నిండుచందురుని వంటి నెమ్మోము, లేడిచూపులవంటి చూపులు, పగడమువంటి పెదవి, అవ్యక్తమధురమైన కంఠము, క్రొత్తచిగురుటాకుల వంటి అడుగుల జంట, మత్తగజ కుంభాలవంటి కుచాలు, ఇసుక తిన్నెలవంటి పిరుదులు, గజరాజగమనమువంటి గమనము, కెందామరలవంటి చేతులు, సింహము నడుము వంటి నడుము కలిగి, పద్మసుగంధాలు వెదజల్లే రుక్మిణీదేవిని చూచి అందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

అంతేకాక ఆమె చిరునవ్వులవల్లా సిగ్గుతో కూడిన చూపుల వల్లా అక్కడి రాజకుమారులకు మనసులు చలించాయి. వారు ధైర్యాన్ని వీడినారు. గాంభీర్యం పదలినారు. గౌరవం మరచినారు. చేష్టలుడిగి తెలివి మాలినారు. ఆయుధాలు జారవిడిచి, ఏనుగులు, గుర్రాలు, రథాలను ఎక్కలేక భూమిపై వాలినారు. లేడి చూపుల గలిగిన రుక్మిణి తన ఎడమచేతి గోళ్ళతో ముంగురులను

ఎగదోసుకొంటూ, పైటను సర్దుకుంటూ, కడగంటి చూడ్కులను ఆ రాజసమూహం మీద ప్రసరింప జేసింది.

ఈ విధంగా చూస్తూ చంద్రబింబంవంటి ముఖమూ, సింహము వంటి నడుమూ,కొత్తతామరవంటి కన్నులూ, అంద మైన వక్షస్థలమూ, నీలమేఘమువంటి శరీరమూ, ఏనుగు తొండమును బోలిన బాహువులూ, పచ్చని పట్టువస్త్రములు, చక్రాయుధమును కల్గినవాడు, విజయమునందు ఆసక్తివున్న వాడూ, జగన్మోహనుడూ అయిన శ్రీకృష్ణుని ఆ రుక్మిణీదేవి దర్శించి నది.

## శత్రురాజులు వీక్షించుచుండగనే శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని గొనిబోవుట

ఆ విధంగా చూచి శ్రీకృష్ణుని రూప, లావణ్య, గాంభీర్య, నేర్పు, తేజస్సు, ఐశ్వర్యములైన ఈ విశేషాలను హర్షించి ఆమె మదన బాణాలకు గురియై త్వరగా రథ మెక్కెందుకై కుతూహల పడినది. రుక్మిణీదేవిని ఆ పుండరీకాక్షుడు అవ లోకించినాడు. శత్రు రాజుల సమూహం చూస్తుండగానే మత్తమాతంగము రీతిన మెల్లనైన విలాసవంతమైన నడకతో చనుదెంచినాడు. సకల రాజ లోకాన్ని లెక్కచేయక తిరస్కరించి రాజకుమారిని రథమెక్కించు కున్నాడు. భూమ్యాకాశాలు దద్దరిల్లునటుల తనయొక్క పాంచ జన్యాన్ని పూరించినాడు. బలరాముడు వెంటరాగా శ్రీకృష్ణుడు యాదవసైన్యంతో ద్వారకానగరమార్గం వైపు మరలినాడు. ఆ సమయమున జరాసంధునకు లోబడిఉన్న పాలకులందరూ కృష్ణుని పరాక్రమాన్ని సహించలేక పోయినారు.

అదిగో! ఘనసింహముల కీర్తిప్రతిష్ఠలను ముక్కోటి మృగాలు అపహరించి విధముగా గొల్లవారు మనయశస్సు దోచుకొని కన్యనెత్తుకొని కావరముతో కదలివెళ్ళుచునారు. ఇప్ప టికి పనికిరాని మన ప్రతాపం మరి ఎప్పటికి మన శస్త్రాస్త్రము లను మంటలో వేసేందుకా? సన్ననైన నడుము గల ఆకన్నియను వారిబారినుండి తప్పించుకున్న సందుగొందులందు సైతము ప్రజలు మనల్ని అపహాస్యం మొనరించరా?

ఇవ్విధమున ఒకరికొకరు చెప్పుకొని రోషమును మనమున కెక్కించు కున్నారు. ప్రతిజ్ఞనుబూని, కవచములను ధరించి యుద్ధ సాధనాలను చేకొన్నారు. జరాసంధాది మొదలైన రాజులు చతు రంగబల సమేతులై యాదవవీరులను వెంబడించి నిలవండి, నిలవండి, అని ధిక్కరించి హుం కరించి పలికినారు. శరవర్షాన్ని కురిపింపసాగారు. ఆసమయములో యాదవ సేనాధిపతులు, చాపాలను ఎక్కుపెట్టి ధనుష్ఠంకారం గావిస్తూ నిలిచారు.

ఆ సమయమునందు శత్రువీరులు శ్రీకృష్ణుని సేనను బాణాలతో కప్పివేయుటను గాంచిన రుక్మిణి సిగ్గుతో శ్రీకృష్ణుని ముఖావలోకనం గావించింది.

అలా ఆమె చూడగనే శ్రీకృష్ణుడు ‘ఓ కమలనయనా! చూస్తూవుండు, మన యాదవవీరులు శత్రుసైన్యాన్ని చెండాడ తారు. విరోధులు మరణిస్తారు– అని పలుకుతూ రుక్మిణీదేవిని ఊరడించాడు. అపుడు బలరామాది యాదవవీరులు విజృం భించిన జరాసంధాది రాజులపై శరవర్షాన్ని కురిపించారు. ఆ శరవర్షానికి శత్రుసైనికుల శిరములు కప్పులు విరిగిపడినాయి,

కాల్బలము కూలిపోయింది. గజ, అశ్వ, రథారోహకుల శిరములు తెగినేలరాలాయి. పుర్రెలు బద్దలయ్యాయి. భుజకీర్తులు వీడిపోయి, గదలు, బల్లాలు, గండ్రగొడ్డళ్ళు, ఈటెలు,ఖడ్గాలు, శూలాలు, చక్రాలు, ధనువులు, విరిగి ముక్కలైనాయి. జెండాలు, గొడుగులు, వింజామరలు, కూలిపోయాయి. రాజుల సమూహం చెదిరింది. నెత్తురుటేరులు ప్రవహించాయి. నక్కలు, కాకులు,గ్రద్దలు, రాబందులు, వీటి అరుపులు చెలరేగినాయి. మెదడు, మాంస మును భక్షిస్తూ నెత్తురు త్రాగుతూఉన్న డాకిని మున్నగు పిశాచా లకు ఆ రణరంగం ఆనందాన్ని కలిగించింది.

ఆ సమయమునందు భయంతో వెనుదిరిగి పరుగిడుతూ జరాసంధాది రాజులంతా ఒకచోట చేరినారు. కళత్రమును కోల్పోయిన వానివలె విలపిస్తూ, వడిలిపోయిన ముఖంతో తన ఎదుట దుఃఖిస్తున్న శిశుపాలుణ్ని చూచి 'శత్రుహస్తములందు బడక ప్రాణాలతో బ్రతికేయుంటివిగదా"! అని ఊరడించారు.

వారందరూ మరల అతనితో ఈ విధంగా అన్నారు 'నాయనా! శరీరంలో ప్రాణాలుంటే ఏ విధంగానైనా బ్రతకవచ్చు. బ్రతికి ఉంటే భార్యలభించకపోదు. భార్యమాట దేవుడెరుగు! ముందు నీవు బ్రతుకుటయే మాకు పదివేలు. ఊరికే దుః ఖించవలదు"

అప్పుడు జరాసంధుడీవిధంగా అన్నాడు– శిశుపాలా! విను. అస్వతంత్రుడైన మానవుడు బొమ్మలాడించే వాని చేతిలో కీలుబొమ్మవలె ఆతడు ఈశ్వరమాయకు లోనై సుఖదుఃఖాలలో నాట్యమాడుతూ ఉంటాడు. గతంలో నేను పరాక్రమంతో

మధురపై 17 పర్యాయాలు దండెత్తగా, నాసైన్యమంతయూ ఓడిపోయింది. నేను బలరాముని చేతికి చిక్కాను. కృష్ణుడు దయతో విడిచిపెట్టగా తిరిగి వచ్చాను. మరల 23 అక్షౌహిణుల సైన్యాన్ని సమకూర్చుకొని 18వ సారి దండెత్తిపోయి శత్రువుల్ని తరిమివేసి విజయాన్ని సాధించాను. నేనెప్పుడూ గెలుపోటములతో మోదఖేదములు పొందియుండలేదు. దైవప్రేరితమైన కాలంవల్ల లోకాలు సాగుతుంటాయి.

అంతేకాదు, యాదవులకు కాలం కలసివచ్చింది. ముల్లో కాలలోనూ ప్రసిద్ధిచెంది పరాక్రమవంతులైన మనల్ని గోవిందుని బాహుదర్పమున వారీనాడు విజేతలయ్యారు. కాలం మనకు అనుకూలించినపుడు పగవారిని యుద్ధభూమిలో చెండాడగలము. దీనికై ఇంతగా చింతింపనవసరములేదు.

ఈ రీతిన జరాసంధుడు అతని సామంతరాజులూ శిశుపాలుని మనోవేద నము తొలగించి తమతమ దేశాలకేగినారు. శిశుపాలుడు కూడా తన సైన్యముతో తన నగరానికి వెళ్ళిపోయినాడు.

అంతట రుక్మిణి అన్నయైన రుక్మి శ్రీకృష్ణుడు రాక్షసవివాహ విధానమున తన సోదరి నెత్తుకుపోవటాన్ని ఓర్చుకోలేక ఒక అక్షౌహిణిసేనతో యుద్ధమున కాయత్తుడై బయలుదేరి కృష్ణుని వెనుకనే వెళ్ళుతూ తన రథసారథితో ఇట్లన్నాడు.

"నేను భీష్మకమహారాజు కుమారుడను. అధిక బలవంతుడనైన నన్ను పిల్లవానిరీతిన చులకన చేసి నా చెల్లిలైన రుక్మిణినిగైకొని ఈ యాదవుడు అసహాయ శూరునివలె నేగుచున్నాడు. మన

రథాన్ని అటువైపు నడుపుము, వాడియైన బాణ ప్రయోగముచే వాని పొగరణచి నా పరాక్రమాన్ని ప్రదర్శించెదను"

ఆ విదంగా రుక్మి కృష్ణుని శక్తి సామర్ధ్యముల నెరుగక రథమును ఆ వైపునకు నడిపించి "ఓ యాదవా! నవనీతచోరా! క్షణమాగు" అని నిర్లక్ష్యభావమున పలికి ధనుష్ఠంకారమొనర్చి మూడు వాడియైన బాణములతో ఆ పంకజాక్షుని సంకటపరిచి ఇట్లన్నాడు.

ఓ కృష్ణా! మా చెల్లిలిని తీసుకువెళ్ళటానికి నీవు మాతో సమానుడువా? నీవెంతటివాడివి? నీ వంశమెట్టిది? ఎక్కడ పుట్టి ఎక్కడ పెరిగితివి? నీ ప్రవర్తన ఎట్టిదో ఎవరికి తెలియదు, నీకు అభిమానం లేదు, మానమర్యాదలు తెలియవు. వంచనము వహింపక ఎదుటపడవు? స్వస్వరూపంతో వైరివర్గం మీదకు వెళ్ళవు. నీవు క్షత్రియుడవు, వావివరసలు లేవు. నీకు మంచి గుణాలు లేవు. మా చెల్లిలిని వదలిపెట్టు, లేనిచో వాడియైన బాణాలతో నీగర్వం సర్వాన్నీ హరిస్తాను".

అలా రుక్మి పలుకుతూండగనే శ్రీకృష్ణుడు నవ్వుతూ ఒక బాణంతో అతని చాపాన్ని త్రుంచివేసి, ఆరు తూపులతో వాని దేహాన్ని తూట్లు చేశాడు. ఎనిమిది బాణాలతో వాని రథాశ్వాలను కూల్చివేసి, రెండుసాయకాలతో వాని సారథిని చంపివేశాడు. మరో మూడు బాణాలతోవాని ధనువును ఖండించినాడు. రుక్మి వేరొక ధనువును అందుకోగా దానిని కూడా విరగగొట్టినాడు. తదుపరి రుక్మి పలురకాలైన ఆయుధాలను ఎత్తినప్పటికీ అన్నిటినీ కత్తిని ధరించి కృష్ణుని సమీపించాడు. శ్రీకృష్ణుడతని కత్తినీ,

కవచాన్నీ నుగ్గునుగ్గు గావించాడు. అంత కృష్ణుడు కత్తిని ఝుళి పిస్తూ రుక్మి శిరస్సును నరికేందుకై ముందుకు వస్తూవుండగా రుక్మిణీదేవి అడ్డంవచ్చి ప్రాణేశ్వరుని పాదపద్మములు పట్టుకొని ఇటుల పలికినది–

నాథా! మాఅన్న దోషరహితుడని మనవి చేయడంలేదు. అతడు నిజంగా దుష్టుడే. కాని ప్రభూ! జగన్నాయకుడైన అచ్యు తుడు తమకు అల్లుడైనాడని, తాము అదృష్టవంతులమని సంత సించు మాతల్లిదండ్రులు పుత్రదుఃఖంతో పగిలిపోతారు.

ఈవిధముగా ప్రార్ధిస్తూ కన్యకామణియైన రుక్మిణీ రుద్ధ కంఠంతో అధిక భయమువల్ల వణుకుతున్న శరీరముతో వాడిన, వంగిపోయిన ముఖముతో చెవులపై పడుచున్న జడ శిరోజాలతో కనులతో తొలకెడి కన్నీటితో నారాయణునకు నమస్కరించింది. దివ్యతేజముతో శోభిల్లుతున్న ఈ దేవకీనందనుడి రుక్మిని ఖడ్గ ముతో ఖండింపక వెనుకకు మరలి–

“బావా! రా’మ్మని చిరునవ్వునవ్వుతూ దగ్గరకు తీసుకుని వానిని పట్టి బంధించి, గడ్డం, మీసం, తల, కత్తితో పాయలు పాయలుగా గొరిగి కురూపిని గావించినాడు. అదేసమయంలో యాదవవీరులు శత్రుసైన్యాన్ని తరిమివేసి శ్రీకృష్ణుని వద్దకు వచ్చారు. అపుడు బలరాముడు జీవన్మృతుడై బంధింపబడి యున్న రుక్మిని చూచి వానికట్లనువిప్పి కృష్ణునితో ఇట్లన్నాడు.

మహాత్మా! ఇతనినిదూరముగ పొమ్మని చెప్పక తల,మూతి, గొరుకుట నాకు న్యాయమా? చుట్టమైన వాడి తల, మూతి, గొరుకుట అనునది తల నరుకుటకన్న మిక్కిలి నీచంగాదా?

